# మీ పేరునుబట్టి మీకు పనికివచ్చే సింహద్వారములు, ఆయుములు తెలుసుకొనుట

| మీ పేరులో మొదటి అక్షరం | వర్గు | సరిపోయే సింహద్వారం | సరిపడనిసింహద్వారం | సరిపోయే ఆయం | సరిపడని ఆయం |
|---|---|---|---|---|---|
| అ నుండి అం,అఃవరకు | అ వర్గు | తూర్పు,పడమర,దక్షిణం | ఉత్తరం | ధ్వజ, సింహ,గజాయం | వృషభాయం |
| క,ఖ,గ,ఘ,జ | క వర్గు | దక్షిణం,పడమర | తూర్పు,ఉత్తరం | గజాయం | సింహ,వృషభ,ధ్వజ |
| చ,ఛ,జ,ఝ,ఞ | చ వర్గు | తూర్పు,ఉత్తరం,పడమర | దక్షిణం | ధ్వజ, సింహ, వృషభ | గజాయం |
| ట,ఠ,డ,ఢ,ణ | ట వర్గు | తూర్పు,ఉత్తరం,పడమర | దక్షిణం | ధ్వజాయం | సింహ,వృషభ,గజాయం |
| త.థ.ద.ధ,న | త వర్గు | తూర్పు,ఉత్తరం | దక్షిణం,పడమర | వృషభ,సింహ,గజాయం | ధ్వజాయం |
| ప,ఫ,బ,భ,మ | ప వర్గు | తూర్పు,ఉత్తరం | దక్షిణం,పడమర | సింహ, ధ్వజాయం | వృషభ,గజాయం |
| య,ర,ల,వ | యవర్గు | తూర్పు,పడమర,దక్షిణం | ఉత్తరం | ధ్వజ,వృషభ,గజాయం | సింహాయం |
| శ,ష,స,హ | శ వర్గు | దక్షిణం, తూర్పు | ఉత్తరం,పడమర | వృషభ, గజాయం | సింహ,ధ్వజాయం |

చైత్ర, వైశాఖ, ఫాల్గుణమాసములందు తూర్పు,సింహద్వారంగల గృహం నిర్మించాలి.
జ్యేష్ఠ, ఆషాఢ,శ్రావణ మాసములందు తూర్పు,దక్షిణ,సింహద్వారములు గలగృహంనిర్మిచాలి.
భాద్రపద, ఆశ్వయుజ,కార్తీక మాసములందు దక్షిణ,పడమర సింహద్వారములు గలగృహంనిర్మిచాలి.
మార్గశిర,పుష్య,మాఘమాసములందు ఉత్తర, పడమర, సింహద్వారములు గలగృహంనిర్మిచాలి.

## అడుగులతో సరియమాలు చేయు పద్ధతి:-

36 అడుగుల పొడవు, 32-3 అంగుళముల వెడల్పు ఉన్నది వైశాల్యం.

### 1) అడుగులను చదరము చేయు పద్ధతి

చదరము-అనగా నాలుగు గోడలని చదరపు-అడుగుల

ఉదా:- 36 × 32 = 1152

1152 + 9 = 1161

9 ) 1161 ( 129 చదరము
1161
------
(0)

అంగుళములను అడుగుల చేయు పద్ధతి

36 × 3 = 108

12 ) 108 ( 9 అడుగుల
108
------
(0)

లబ్ధము 129 చదరము

## 2) ఆయములు చేయు పద్ధతి:-

నక్షత్రమును 9 చే హెచ్చించి, 8 చే భాగించగా వచ్చిన శేషము ఆయమనబడును.

ఉదా: 129 × 9

8 ) 1161 ( 145
 1160
 ————
 1 శేషము కావున ధ్వజాయము.

— x —

1 - ధ్వజాయము
2 - ధూమాయము
3 - సింహాయము
4 - శ్వానాయము
5 - వృషభాయము
6 - ఖరాయము
7 - గజాయము
8 - కాకాయము.

ధ్వజ, సింహ, వృషభ, గజాయములు శుభకరములు

— x —

మిగిలిన ఆయములు అశుభకరమైనవి.

3) ధనము కనుగొను పద్ధతి:-

వైశాల్యమును 8 చే హెచ్చించి, 12 చే భాగించగా శేషము 0 వచ్చిన దీనిచే భాగింప బడినదని అర్థము పూర్ణాంకముగా తీసుకొనవలెను.

ఉదా:- $\frac{129 \times 8}{}$

12) 1032 ( 86
1032
(0) 12 ధనము.

---

4) ఋణము కనుగొను పద్ధతి:-

వైశాల్యమును 3 చే హెచ్చించి, 8 చే భాగించిన శేషము ఋణము వచ్చును.

ఉదా:- $\frac{129 \times 3}{}$

8 ) 387 ( 48
384
3 - ఋణము.

## 5) తిథిని కనుగొను పద్ధతి:-

పథకమును 8 చే హెచ్చించి, 30 చే భాగించగా శేషము 30 వచ్చిన అమావాస్యయగును. కమిర శుభము కాదు.

ఉదా:- 129 × 8

```
30)1032(34
   1020
   ----
     12 తిథి
```

---

## 6) వారము కనుగొను పద్ధతి:-

పథకమును 9 చే హెచ్చించి 7 చే భాగించగా వచ్చిన శేషము వారమగును.

ఉదా:- 129 × 9

```
7)1161(165
  1155
  ----
     6 వారము
```

7) నక్షత్రము కనుగొను పద్ధతి:-

పదకమును 8 చే హెచ్చించి 27 చే భాగించగా వచ్చిన శేషము నక్షత్రమగును.

ఉదా:- 129×8

27)1032(38
1026
6 నక్షత్రమగును.

---

8) యోగము కనుగొను పద్ధతి

పదకమును 4 చే హెచ్చించి 27 చే భాగించగా

ఉదా:- 129×4

27)516(19
513
3 యోగము

---

9) కరణము కనుగొను పద్ధతి

పదకమును 5 చే హెచ్చించి 7 లేదా 11 చే [illegible] మతములచే భాగించగా వచ్చు శేషము కరణమగును

ఉదా:- 129×5

7)645(92
644
1 కరణము

129×5

11)645(58
638
7 కరణము

## 10) ఆయుస్సు కనుగొను పద్ధతి

పక్షరములు 9 చే హెచ్చించి 120 చే భాగించగా వచ్చు శేషము ఆయుస్సు అగును.

ఉదా:- 129 × 9

$$
120 \overline{)1161} (9
$$

1080

81 ఆయుస్సు

---

## 11) అంశము కనుగొను పద్ధతి

పక్షరము 6 చే హెచ్చించి 9 చే భాగించగా వచ్చు శేషము అంశము అగును.

ఉదా:- 129 × 6

$$
9 \overline{)774} (85
$$

765

9 అంశము

12) <u>విస్తృతిని కనుగొను పద్ధతి</u>

నక్షత్రమును 9 చే హెచ్చించి 8 చే భాగించగా వచ్చు శేషము విస్తృతి అగును.

ఉదా:- 129×9

```
8)1161(145
  1160
  ----
     1 ఇంద్రు నక్షత్ర
```

| | |
|---|---|
| 1 - ఇంద్రుడు | 5 - వరుణ |
| 2 - అగ్ని | 6 - వాయువు |
| 3 - యముడు | 7 - కుబేరుడు |
| 4 - నైఋతి | 8 - ఈశానుడు |